# తొలకరి



పింగళి లక్ష్మీకాంతం
కాటూరి వెంకటేశ్వరరావు

# తొలకరి.

గ్రంథకర్తలు.

పింగళి లక్ష్మీకాంతం,

కాటూరి వెంకటేశ్వరరావు.

---

బందరు, కృష్ణాస్వదేశి ముద్రాక్షరశాలయందు

ముద్రితము

1923.

---



[వెల రు 0-8-0.

# తొలిపలుకు

ఈ గ్రంథమును రచించినకవులు శ్రీపింగళి లక్ష్మీకాంతంగారును, కాటూరి వెంకటేశ్వరరావుగారును. "తొలకరి" యను భావగర్భితమైన శీర్షిక నిడియుండుటచేత వీరు వయసుఁ జిన్నవారనియు నియ్యది య వీరి మొదటి కృతియనియు నూహించెదను. ఎట్లును నానాభావబంధురమైన హృదయము గలవారనుట స్పష్టము. రసార్ద్రహృదయులు నిత్యయౌవనులు గదా!

ఈ పుస్తక మనేకకృతులచే రచింపఁబడిన సుకుమారపుష్పమంజరి యన నొప్పుచున్నది. ప్రతి కృతియొక్కయు రససౌరభము, ఆకృతి విలాసము, కాంతియొక్క వినోదము, అనన్యమును నసాధారణమును నైయున్నవి. శైలుల తెఱంగులును వివిధములు. "రక్తతిలకము" ప్రాచీనధోరణిని దిద్దఁబడి యున్నది. "సమశీల వయస్కులు" "నిడుదకనుల్ విశాలమయి" ఇత్యాది పద్యములయొక్క రచనకును "కోకిల" "జొన్నచేను" మొదలగు కృతులయొక్క రచనకును భేదమున్నది. ఈభేదము భావముననుసరించి యుండుటచేతఁ గళా కౌశలమునకుఁ బోషకముగా నున్నది. మొత్తముమీద నీకవుల ధోరణి యాధునికము. ఆధునిక మనుటకన్న నవీనమన్న నింకయు సత్యము. ఆంధ్రభాషయను మహావనము కొన్నిశతాబ్దములుగఁ బెరుగుట మాని యుండి నూతన దేశీయజీవితమను ఋతువువచ్చినందునఁ బ్రాతప్రబంధములను పండినయాకులను రాల్చి, పాశ్చాత్య సంపర్కమను కృషి

మొదలగు కారణములచేతఁ దనకు నైజమైన పునర్వికాసము నూపుట కారంభించి, క్రొత్త క్రొత్త చిగుళ్లను, బూవులను, వెలిఁబెట్టుచు నవీన వసంతమును ధరించి యెంతయు మనోహరముగనున్నది. ఈ మహనీయ సృష్టిప్రభావమునకును బరికాశమునకును జేసినవారిలో నీకవులు ముఖ్యముగ గణనీయులు.

ఈ కృతులనేకములు భావగీతములని యిప్పుడు ప్రచారమునకు వచ్చిన క్రొత్త కవితా ప్రపంచమునకుఁ జేరినవి- ప్రకృతివర్ణనములు కడుచక్కగను, సూక్ష్మదృష్టితోను, జేయఁబడియున్నవి అంతియ కాక, ప్రకృతిస్వరూపములు వికారములు మొదలగువానికిని, మనుజులయొక్క—అందును నకృత్రిమ స్వభావులయొక్క—చిత్తసంచారములకునుగల సంయోగమును కవులు మఱచియుండలేదు. గుణమున నింతకంటె శ్రేష్ఠములైన కృతులు మనభాషలోఁ బెక్కులులేవు.

ఈ కవిత్వము ముఖ్యముగ సరసుల నాకర్షించునదిగా నున్నదని నాయభిప్రాయము. గడుసుబాఱిన నాలుకల కియ్యది యట్టెరుచింపదు కాఁబోలు. కవిత్వముయొక్క చెప్పరాని, చూపరాని, పట్టరాని, అంటరాని సొగసుఁదన మెంత యభిరామముగా వర్ణించియున్నారో చూడుఁడు:—

"సీ॥ మాతురా ? దీనిని చూతపల్లవఖాదిని
పికాంగనాగాననిస్వనంబు
కొందురా ? దీనిని గ్రామ్మెత్తుంగుళజిల్కు
పనికిఁ గాదగిన కుందనపుఁదళ్కు

కావలెనా ? యిద్ది, కలువపూరేకు
పాత్రముఁ జిప్పిలెను మెత్తందనమ్ము
వలయునా ? మలయపర్వత సానువులనుండి
దిగుమతియగుకమ్మ తెమ్మెరలివి

గీ॥ తీయుదుర? దీని, వెన్నెల తేటనిగ్గు
ఒలయుదుర? దీనిఁ బచ్చకప్పురపుఁదావి
కోరికొందురా? దీనిఁ బటికజలము
తావిమాత్రురా? తీయనిపూవుఁదేనె" ॥

ఇక ప్రకృతితో లీనమై, ఆ సాయుజ్యసుఖముచేతఁ బరవశులై మాటలాడినారో యనునట్లుండెను నీక్రింది వాక్యము లాకర్ణింపుఁడు

"గీ॥ నీడలాడెడు నీచెట్లతోడ దొంగ
బూచి దోబూచి యాడుచుఁ బొద్దుగడపు
చందమామను బట్టి తెంచవుగదన్న ?
ఎచటికేగును జాబిల్లి? యింటనీదు
చిన్నచెల్లెలు నీవు లేకున్నబువ్వ
తిననుచుఁ బోరుపెట్టుచుండెను గదోయి!
పలుగుపలుగునఁ జనుము నిన్నరయువారి
కంటబడకుండుగఁ జెల్లితో నింటిముందు
నారుబయటను గంచమ్మునందుఁ దొంగి
చూచు జాబిల్లితోడ దోబూచియాడఁ
కోనుచుఁ బాలును నన్నమ్ము తినెదుగాని" ॥

"జొన్నచేను" అనిర్వాచ్యమైన మాధుర్యముఁ గలయది. దాని యందలి యీ భాగమును దిలకింపుడు:—

"గీ॥ సెనగపూసైక త్రొడిగినచిన్నదాన!
చిలుకయొక్కటి వ్రాలె నామలుపునందు
నెంతతోలినఁబోవదే శేమి సేతు ?
మెఱపలీయేడుమీకు సమృద్ధి, వంగ
చెట్టులిప్పుడిప్పుడె పూత పట్టుచుండె
బంతిపూవులు ముగ్గుల పండువునకు
నక్కరకువచ్చు, నియ్యేడ నొక్క. విరప
పండు పండెను—గోయకవదలదీనిఁ
దోలుచుంటిని నేఁ బిట్టఁ వాలకుండఁ
గోసికొనుమింక గుప్పెడు—దోసతీవ
లున్నవాదరిగా; గాయలున్నవేమొ
చూడుమీ—నాల్గుకఱ్ఱల నూడబెఱికి
కంకులనుగొట్టుమందు, నాకంచెకేగి
చిదుకులందెమ్మువీనిఁ గాల్చెదవుగాని
పచ్చజొన్నలు తీయని పాలుగారు
లేతగింజలు తినుము కాలిచిననింత
తీపియుండదు—తట్టనెత్తెదవదేల ?
నూగుపోవ నూదెడి దన్క నాగలేవె ?"

ప్రాచీనశైలికిని (అనగా ప్రాచీన విషయవర్ణనల కనుగుణమైన శైలికిని) ఆధునిక శైలికిని (అనగా నవ్యభావముల వర్ణనకనుగుణమైన శైలికిని) గలతారతమ్యముల నెవరైన విమర్శకులొకరు పరికించి వివరించిన బాగుండును. వాడబడు పదములువేరు. అవి కూర్పఁబడు విధములువేరు. పూర్వులాశ్రయించిన పద్యములు ముఖ్యముగా వృత్తములు కందములు. ఇప్పటి నవకవులకు విశేషముగ యోగ్యములైనవి గీతములు ద్విపదలు. పూర్వకాలపు స్వతంత్ర ఆంధ్రకర్తలు విశేషించి "తరువోజ" "అక్కర" మొదలగు పద్యరీతులను వాడియున్నారు. "సీసము"కూడ మనయాదియేయని చెప్పవచ్చును. ఇప్పటివారు కొందఱు పూర్వఛందస్సులను గ్రహించియున్నారు. ఇట్టిమార్పులింకనెన్ని యో సంభవించినవి- వాని నామూలాగ్రముగ విశదీకరించుటకు నాకుఁగాఁ ముచాలదు. శక్తి యంతకుమున్నే లేదు. అయిననొక్కమాట; ఈ పరిణామము సహజమనియు ననివార్యమనియు దోచుచున్నది. పూర్వుల భావముల రీతులు వారిమార్గములు వేఱు. ఇప్పటివారి భావ ప్రచారము వేఱు. మనకు రంగస్థలము విశాలముగా నుండవలయును. మన భావస్రవంతి యనేకోపనదుల కూడికచేఁ గల్లోలమునై, నెడ తెగని ప్రవాహము గలదిగానుండుటచే సంక్షేప విక్షేపములకు సులభ సాధ్యములైన గీతములు ద్విపదలు అనుకూలించినట్లు వృత్తములనుకూలింపవు- మఱియుఁ వృత్తములు సంస్కృతమునందుండి పుట్టినవి. అవి తద్భవములునుగావు, తత్సమములు. ఆంధ్రుఁడయాత్మకు నవి తగిన శరీరములు కానేరవు. కావున మనము స్వతంత్రముగఁ గృతులు రచియింపఁబూనిన యీవర్తమానకాలమున ద్రావిడలోక సంజనితములైన ఛందోభంగులు పునః స్థాపితములు కావచ్చుటలోఁ జోద్యమేమి? మంజరీ ద్విపదయందుఁబాడఁబడిన పల్నాటివీరచరిత్రమునకన్న వేమన్న యాట వెలఁదులకన్న మించిన కవిత్వము నూహింపసాధ్యమా? కాదని నావిన్నపము. అట్లగుట, మనలో స్వచ్ఛందముగ మొలచి పెరిగిన వృక్షముల నీడలలో మన మనోయానమును మనము దీర్పఁజూచు

కొనుట సహజముకదా! ఇదివరలో మన కవితాదికళలు పారతంత్ర్యములుగా నుండినవి. ఇప్పుడు మనతోఁబాటు వానికిని స్వాతంత్ర్యము వచ్చినది. కావున సంస్కృతముయొక్క దాస్యమునుండి విముక్తి నొందుచున్నారమని నానమ్మకము. ఆర్యులమతములు, వారి వర్ణధర్మములు మొదలగు సంఘనీతులు— ఇవన్నియు, స్వతంత్రపరీక్షకుఁ బాత్రములు, వర్జనీయములైనను గావచ్చును.

అయిననొక జాగ్రత. ఆర్యదాస్యమువదలి యాంగ్లేయ దాస్యములోఁబడుట యేమాత్రమును మంచిదికాదు. ఎట్టిపారతంత్ర్యమును స్వాతంత్ర్యమునకు నీడుగాదు. స్వాతంత్ర్యమనగాఁ బరులతో సంబంధములేక యుండుటకాదు. మఱి మనబుద్ధిని బ్రయోగించి యన్నికాలములందలి అన్నిదేశములయందలి గుణములను సాధ్యమైనంతవరకు గ్రహించి మనలో జీర్ణముచేసికొని దినదిన ప్రవర్ధమానులమైయుండుట. ఎండి, బిఱబిగిసికొని, గాలినిబీల్చలేక, నీళ్లను ద్రావలేక పడియుండు వంటకట్టె స్వాతంత్ర్యమునకు నిదర్శనముకాదు తుదకు సజీవత్వమునకును గాదు. దానిగతి క్రమముగఁ గాల్పఁబడుచుటయే. నేనాదేశించునది స్వాతంత్ర్యము. కేవలత్వము కాదు.

ఈ కవులు నిక్కముగ స్వతంత్రులు. ఆర్యాంగ్లేయాది వాఙ్మయముల సారములఁ బీల్చి, తమయందు లీనముగఁ జేసి దానిచేఁగలిగిన పుష్టిచేఁ బుష్కలముగ వ్రాయువారు. వీరి కవిత్వమున నిక్కంపు మంచినీలములున్నవి. తళుకుబెళుకు రాళ్ళులేవు. అయినను రత్నపరీక్షయందు సమర్థులగువారికేఁగాని సామాన్యులకు వానిగుణము తెలియంగ నలవికాదు.

"సుకవిభాగ్యమ్ము లివటివస్తువులు, వీని
నరిపివేయకు డటునిటు కలచివైచి"

చిత్తూరు. కట్టమంచి రామలింగారెడ్డి.



# తొలకరి.

—— :o: ——

## కవితాసామగ్రి.

సీ॥ చూతురా? దీనిని జూతపల్లవఖాదిని
పికాంగనాగాననిస్వనంబు।
కొందురా? దీనిని క్రొమ్మెఱుంగుల జిగ్గు
పనికిఁగాఁదగిన కుందనపుదళ్కు।
కావలెనా? యిద్దె, కలువపూఱేకు
పొత్తములఁ జిప్పిలెడు మెత్తందనమ్ము।
వలయునా? మలయపర్వతసానువులనుండి
దిగుమతియగు కమ్మతెమ్మెరలివి॥
తే॥ గీ॥ తీయుదుర? దీని వెన్నెలతేటనిగ్గు।
ఒఱయుదుర దీనిఁ, బచ్చకప్పురపుఁదావి।
కోరకొందురా, దీనిఁ బటీరజలము।
త్రావిచూతురా, తీయనిపూవుఁదేనె॥

మ॥ నికరమ్మై, యకలంకమైన సరకుల్, నిర్దుష్టముల్ మీపరీ
క్షకు దాళంగలమేలిక్రొందినుసు మీకన్గప్పు మోసంపు వ।
ర్తకుఁడఁగాను, కులక్రమాగతము వేఱమ్మద్ది భాషాకుమా।
రకులారా! కొనరండు మీరు కవితారంభప్రియంభావుకుల్॥

సీ॥ ఈనాటిదా! మాకు, బానయ్య మామూల
పురుషుండు యజ్వకీసరకులమ్ము ।
ముత్తన్నసెట్టి మాముత్తాత పింగళి
వారింటఁ దననాఁడు వతనకాఁడు ।
కన్నయ్య, మాతాతకాలానఁ జేమకూ
ర్వెంకన్న మాకొట్టు బేరగాఁడు ।
ధవళేశ్వరమున మాతండ్రి యంగడిమీదఁ
దిరుపతికవులు నీసరకెకొనిరి ।

తే॥ గీ॥ నమ్మకమ్మైన యీసరకమ్ముచుందు ।
నాంధ్రదేశమ్ము నలుదిక్కులందుఁ దిరిగి ।
వతనుగానిత్తు నే ననువత్సరమ్ము ।
నొకపరిఁగొనుండు మాఁటునమ్మకము తెలియు ॥

మ॥ చనుదెండో కవులార! మీరు కవితాసామగ్రి వాంఛింతురే ।
ననుజూ బందరుపేఁటలన్ దిరుగు బేహారిన్ విలోకించి తె ।
చ్చెనురా కైతములమ్మకానికని వచ్చెన్ గావ్యకృన్మామసా ।
ధనచింతాపరుఁడొక్కఁడుండు బుజముల్ దాటించుచున్ వీధికిన్ ॥

ఉ॥ రచ్చకువచ్చి, యోయి యిటురమ్మనిపిల్చి కవిత్వవస్తువుల్ ।
తెచ్చితివా! కనుంగొనెదఁ దీయుముమూతలటంచొకొక్కఁడున్ ।
విచ్చి, సకౌతుకాద్భుతపు వీక్షలఁ జూచుచు నీసడించి పో ।
వచ్చు, నివేటివస్తువులు వర్తకుఁడా! యని నవ్వి యిట్లనున్ ॥

మ॥ కపురంపుంబలుకుల్, తుషారజలముల్, కల్యాల్ పికధ్వాన మ ।
చ్చపుబంగారము, పూవుఁదేనియలు జ్యోత్స్నల్ చల్లగాలుల్, కవి।

త్వపుసామగ్రియటంచుఁ జూపెదు, కవిత్వంబన్న నెట్లుండునో ।
యెపుడుఁ జూడనివానికిం బలెనె పొమ్మి చాలు సంతోసమే ॥

క॥ అని దారిఁజూపు కవి మొగ ।
మునుగని వెలిగంది ధైర్యమున నేమేమో ।
యనఁబోవు జేరి సరకులు ।
గొనుదలపున మూగిరింకఁ గొందఱుసామున్ ॥

సీ॥ ప్రౌఢసమాసకల్పనమున్న నీయొద్దఁ
జూపుమీ యని చేయిచాపె నొకఁడు ।
శ్లేషకవిత్వమంజూష నీకడనున్నఁ
గొనియెద నేనంచుఁ గొసరె నొకఁడు ।
సత్కావ్యరచనారసాయనంబున్నచో
నీబుద్ధినింపుమంచిచ్చె నొకఁడు ।
ఆశుకవిత్వమ్ము నల్లుమంత్రములున్న
నూదుమీయని చెవియొగ్గె నొకఁడు ।

గీ॥ ఫారిసీ మెట్లు వ్రాయంగఁ బనికివచ్చు ।
ఘణితులేమేని యున్నచో బయటఁబెట్టు ।
మంతియేకాని, కవనదాహమ్ముఁదీర్ప ।
మంచునీళ్ళెలయని కోపగించె నొకఁడు ॥

గీ॥ ఇట్టులెగబడువారిఁ గన్నెత్తిచూచి ।
అంగడిని సర్దుచున్ సెట్టి యన్నలార ।
దండమిడుదును నన్నుఁ బోనిండు లెండు ।
మందుమాకు లీయంగడియందు లేవు ॥

సీ॥ కవితాలతాంగికిఁ గణ్ఠభూషణ మైన
కలువ మీచేఁ బడి నలిగిపోవు ।
మీకృతికన్యల కీ కుందనఁపుదక్క-
నగలు కై సేయు పుణ్యమ్ము గలదె ।
యీనలిగాడ్పు మిమ్ము దహించిన దవ
జ్వాల లీనునె కాని సౌఖ్యమిడదు ।
తీయని యీ గంధుగోయిలగానమ్ము
నెగటాయె నౌర మీ వీనుగవకు ।

తే॥ గీ॥ ఈతుషారజలమ్ము మీచేతులంటి ।
మలినమై పోయెఁ గొనకున్న మానెపొంసు ।
సుకవిభోగ్యమ్ము లిచటి వస్తువులు వీని ।
నలిపివేయకుఁ డటునిటుఁ గలచివైచి ॥

చ॥ ఎఱుగకవచ్చినాఁడ క్షమియింపుఁడు వేఱొకపేఁటయందు నే ।
ర్పరులుగలారు వారు నను రమ్మని మాటికిఁ జీరుచుందురేఁ ।
బౌరపడి వీనినమ్మెదనుబో! తమబోంట్లకు లాభమేమి ? నా ।
సరకుల పేరుకూడఁ జెడుఁజాలనిసాగ మఱొక్కచోఁటికిన్ ॥

# కవిశిశువు.

కం॥ ఎత్తినతల వంచకయే వి
యత్తలమున దృష్టినిలిపి, యానందరసా
యత్తతఁజొక్కెద, వింటన్
దత్తరపడుచుండిరి తలిదండ్రులుకన్నా!

ఉ॥ తోడియనుంగు బాలకులతో, నడువీధిని దాగురింతయాఁ।
టాడెడు నిన్నుఁజూచితి,నయారె! ముహూర్తముక్రింద నింతలో।
నీడకు నెట్లుచేరితివొ? యెవ్వడు నిన్నిటు డించిపోయెనో !
వాడకువాడకున్ దిరుగువాడసుమీ తలిదండ్రులర్భకా ॥

ఉ॥ "సంగడికాండ్రయాటలఁ బసందును సౌఖ్యములేదు, నీకునా ।
బంగరుపూతయాకల నుపాయనమిత్తును, వెంటరమ్మునా ।
సంగతి నాడుకొమ్మనుచు" జక్కవయాసలువెట్టి, చిత్తమున్ ।
దొంగిలితెచ్చి నిన్ నిలిపెనో? యసహాయత నూరివెల్పులన్ ॥

చం॥ "పరుసను నందరా" దనెడిపట్టుదలన్, శ్రమమన్ననెట్టిదో ।
యెఱుఁగక కాలు నేలపయినించుక మోపక యాటసందడిన్ ।
బరువిడునప్డు మేనదిగువారుచు, నీకొకవన్నెవెట్టు నా ।
చిరుచెమటల్ హరించునని చేరితివో? వలినాలితెమ్మెరన్ ॥

కం॥ చుక్కలలో నేదే నెక
సక్కెములాడంగ, వదలి చననొల్లక యా
చుక్కను రెట్టించుచు నీ
విక్కరణిన్ నిలచియుంటివేమొ? కుమారా ॥

తే॥ గీ॥ నీడలాడెడు నీచెల్లితోడ దొంగ
బూచి, దోబూచియాడుచు బ్రొద్దుగడపు
చందమామను బట్టెంచవుగదన్న !
ఎచటికేగును ? జాబిల్లి ; యింటనీదు
చిన్నచెల్లెలునీవులేకున్న, బువ్వ
తిననను చుఁ బోరుపెట్టుచుండెను గదోయి;
పలుగుపలుగునజనుము నిన్నరయువారి
కంటెముందుగ జెల్లితో నింటిముందు
నారుబయటను కంచమ్మునందుఁ దొంగి
చూచు జాబిల్లితోడ దోబూచి యాడు
కొనుచు పాలును నన్నమ్ముఁ దినెదుగాని ॥

శా॥ "ఓడింతున్ నిను, నన్ను దాటగలవేమో ? చూతురమ్మన్న" నీ ।
నీడన్ దాటెడు నాస వెంటఁబడి యెంతేయత్నమున్ సల్పియున్ ।
గూడన్ జాలక యీసునన్ గసలు నిన్నున్ నవ్వుచున్, జెట్లకీ ।
నీడన్ మాయముజెంద, దానికయి యన్వేషించుచున్ నిల్చితో ? ॥

ఉ॥ ఆఁకటిప్రొద్దెఱుంగక, సహాయులఁగూడక, రేయినాక, పై ।
నాకసమందుదోచెడి శశాంకుఁడుఁ జుక్కలెతోడుగాగ ని ।
ల్లేకతముండి, నిశ్చలత నేదియొ ? యోచనమగ్నియున్న వ ।
త్సా! కవివై యశమ్మును జిరాయువుగల్గి సుఖమ్ము జెందుమీ॥



# కోకిల.

---

వెన్నకన్నను మృదువగు క్రొన్ననలను
మెక్కి కొమ్మావిగున్నపై నెక్కి పంచ
మస్వరంబున నవ్యక్త మధురగాన
మును బొనర్చెదు, కోకిలా, వెనుక దిరిగి
చేరువ నెయున్న హాని వీక్షించవేమి.

వింటిబద్దను జేగొని, కంటిరెప్ప
వాల్చకుండగ, దృష్టి నీప్రక్క నిలిపి
పొంచియున్న కిరాతు వీక్షించవేమి ?
తొంగిచూచెడి యాకంట దుమ్ముచల్లి
యెగిరిపోవేమి? యెత్తిన దెత్తినట్టు
వింటిబద్దను గ్రింద దింపింపవేమి?
బోయని దురాశ నట్టేట ముంపవేమి?
గానలోలత్వమున బ్రాణమైన విడువ
దలచువారేమి? గానప్రియులకు దేశ
కాలములు లేనిమాట నిక్కమ్ము సేసి.
చెవిని నోరుంచి నే నెంతచెప్పుచున్న
నింత నిశ్చింతతో నుందు వేమిచెప్పుము?
ప్రాణములుదాల్చి సంసారబాధకంబు
లనుభవింపగలేక ప్రాణాశవిడుతొ?
నీకు దిగులేమి పిల్లల సాకవలెనొ?
గూటికై చిదుకుల నేరుకొనగవలెనొ?

అట్టి సంసారతాపత్రియమ్ము లేక
మురియుచుంటివి, కడిగిన ముత్యమట్లు
లవసరంబేమి బ్రతుకుపై నాశవిడువ
బ్రతికియుండిన సుఖములు పడుదుగాని
కష్టములులేవు నీకు నెక్కాలమునకు.

నిరపరాధిని నన్నేల రొయిలుకు గొట్టు
ననెడి నిర్భీతిమై నుంటివా వచింపు
అనపరాధులు నపరాధు లనెడి భేద
లవము కఠినాత్మకులకు హుళక్కిసుమ్ము.
నిండు మాలాలగుటచేత, నిలిచి నిలిచి
యాలసగమనంబుతో నడయాడు, కన్నె
లేడి, మృగయాప్రియునిచేతి వాడికత్తి
కెఱయగుట కపరాధమదేమి చేసె.

ఒండుచింతలు దక్కుము, పొండిధైర్య
మును వహింపకు, నావాక్యములను నమ్మి
వేరుకోటికిఁ బొమ్ము జీవించియున్న
రేపు నీగాన మహిమంబు సూపవచ్చు.

చూడఁగాఁజాల నీవిటఁ బాడువింటి
దెబ్బతిని క్రిందఁబడఁగ నీయబ్బ చెట్టు
కడకుఁ బరుగువవచ్చి నిన్నొడిసిపట్టి
మెడవిఱిచి సంచిలోఁ గుక్కి నడుచుమంచ.

నిర్దయాస్వాంత! కోకిల నిరపరాధి
సర్వసముఁడగు దేవుఁడు సకలభూత
ములకు సమమైన యధికారమునె యొసంగెఁ
బ్రకృతియందున వేర్వేఱ బ్రతుకుకొఱకు
దానికంటెను నీయందుఁ దవిలియున్న
ఘనతయేమొ వచింపు నీకండకావ
రం బొకఁడుదక్క, నంతమాత్రంబుచేత
నొరులసంబంధమేలేక యుండనొక్క,
గూఁడయినలేక, యేచెట్టుకొమ్మయందొ
బ్రతుకుచుండిన దీనిఁ జంపంగవలెనె?
యేమియెఱుఁగని పక్షుల హింసచేయ
నెట్లుపాలించు నిన్ను సర్వేశ్వరుండు.
హాయిగొల్పుచుఁ గర్ణరసాయనముగఁ
బాడుచున్నది వినుము నీబండచెవికి
శూలములవలె నాటినదొ మఱొక్క,
యెడకుఁ బోరాదె? నీకంటు నెట్లుపడెను
రా! దురాత్మక! యీపక్షిరాజ మిపుడు.
దిక్కులేనట్టివారికి దిక్కు దేవుఁ
డనెడివాక్యము సత్యమే యైనయెడలఁ
బరభృతంబది నీచేతఁబడక మున్నె
భూతనిర్మాణకర్తయే బ్రోచుదాని.
రాక్షసాగ్వంబు నే ననరాదుగాని
నీదు కడుపునఁ బుట్టిన నిసువు నీదు

కట్టెదుట నొక్క కూ్రరుఁడు కఱకువాల
మున విదల్చుచునుండు నిముసమునందు
శిశువు నీవంక దీనదృష్టిని మఱల్చి
కావ్రరనియేడ్చి యసువు గోల్పోవునపుడు
కఠినచిత్తుడవైన నీకడుపుగూడ
అంపపుంగోతపడదె కిరాతహాతక!
బాహుబలమును బుద్ధివైభవమునున్నఁ
గత్తి చేఁబూని యుద్ధరంగమున కుఱికి,
స్వామిభక్తిపరాయణత్వమునఁగంత
రక్తధారలఁ బశ్చిమరాష్ట్రములను
దడుపుచున్నట్టి వీరహైందవులఁజేరి
నీదుశక్తిని బ్రకటింపరాదె? యప్పుడు
దేశసంరక్షణార్థమై దిగితివంచు,
సల్పుదును బద్యకుసుమపూజలను నీకు.

# స ం క్రా ం తి .

గీ॥ దినకరుఁడు కాంతుఁడైతోఁచె దినములింత
కుఱుచలయ్యెను జలిగాలిచుఱుకుహెచ్చెఁ
బొలములఁజేల గుడ్డివెన్నెలలలోనఁ
గుప్పలన్నూర్చుకాపులు గొంతులెత్తి
పదములఁ బాడఁదొడఁగిరి పచ్చపూల
జనుపచేలకు ముత్యాలసరులుగూర్చి
మిరపపంట్లకుఁగుంకుమ మెరుపుఁదార్చి
బంతిపూవులమొగము లల్లంతవిచ్చి
మనగృహమ్ముల ధాన్యసంపదలనిల్పి
సరసురాలైన పుష్యమాసమ్ము వచ్చె

కోడితోఁ మేలుకొని తానమాఁడి నుదుటఁ
దిరుమణియుఁ దిరుచూర్ణముఁ దీర్చిదిద్ది
యొక్క కేలను దంబుఱ నొక్కకేలఁ
జిఱుతలంబూని నున్నని శిరముపైని
తొలఁగకుండ నక్షయపాత్రి నిలిపి మేలు
కొలుపులంబాడి వీధి వీధులనుదిరిగి
యనుపదమ్మను "రంగరంగా" యటంచుఁ
గడపగడపకు నేగి భిక్షమ్ముఁగొనుచుఁ
జేరవచ్చెను సాతానిజియ్యరడుగొ.

మేలుకొనుమమ్మ నాతల్లి ! మేలుకొనుము
తల్లి వేసినముగ్గు చెదరకమున్నె
గొబ్బిళులు చెల్లితోఁ బెట్టుకొందుగాని
బంతిపూవులు, ముద్దచేమంతిపూలు
చంద్రకాంతమ్మలును, సన్నజాజిపూలు
గోసి యొడినింపుకొని తెచ్చుకొందుగాని !
తల్లిరో ! దొడ్డిలోని సీతాఫలమ్మ
కోసియిచ్చెదరమ్మ కుంకుమముఁబసపు
గొబ్బెమకలంకరించి మ్రొక్కుదువుగాని,
నిన్నుదీవించు గొబ్బెమ్మ కన్నతల్లి !
తమ్ముడా ! రమ్మ గంగెద్దుదాసుడదుగొ;
వెండిబిళ్లలమొలత్రాడు దండకడెము
ముక్కునఁ జైడికాడయు మోమునందుఁ
బంగనామమ్ములును, వెంట గంగిరెద్దు,
చేతమునికోల తనపేరుసెప్పుచుండ
నూరినడువీధి నాడుచునుండెరమ్మ
డోళ్ల చప్పుళ్ళు, మంగిలికోళ్లపాట
లడర శ్రీరామునకును సీతమ్మనిచ్చి
పెండ్లిఁగావింపుచుండె నా వేడ్కఁజూచి,
కానుకల నిచ్చివత్తము కదలిరమ్మ!
"బసవనా ! పాలుద్రావెదో ? ప్రత్తివిత్తు
లేతిసెదొ ?" యంచునడిగి గంగెద్దుచేతఁ
దలనుద్రిప్పించు వింతఁజూతమట్లురమ్మ !!

## సంక్రాంతి.

అన్ని పండువులందు ముఖ్యమిదిగాన
నత్తవారింటికేగుమో క్రొత్త పెండ్లి
కొమరుఁడా! యందునీకునెక్కుడు సుఖమ్ము
ముద్దుమరదలునీతోడ ముచ్చటాడు,
వదిన నీతోడమాటికి ఎరుసలాడు,
గలవుదీరఁగనినుఁగాంచు తెరువులేక
తలుపుచాటువనిలిచి నీ తరుణినిన్ను
నోరచూపులఁజూచి, యుబ్బూపలూచుఁ
జిత్తమును; నిన్నుఁజూచి యాచిగురుఁబోడి
పట్టజాలని సంతోషభరముచేత
నింటమాటికి నటునిటు నేగుచుండి,
ముగ్ధమోహన కళ్యాణమూర్తితోడ
సమయమగునెడ నీకు సాక్షాత్కరించు,
నత్తవారింటి విందులటన్న, భార్య
వాలుఁజూపుకోపులెకాని, వారుపెట్టు
పంచభక్ష్యమ్ము లనుకొని భ్రాంతిపడకు,
మూరివారలు నిన్నతిగారవమున,
మన్ననలు సల్పుదురు, నీదు మామకూడ
నడుగులకు నీకు భృత్యుఁడై మడుగుఁలొత్తు,
నత్తవారింటికేగి రావయ్యనీవు.

వెలమదొరలార! రండు, మీ పెంచినట్టి
గొఱ్ఱెపోతులఁదెండు, మీకోడిపుంజు
కాలికిఁ గత్తిఁగట్టి పంతాలుపలికి

పౌరుషముఁ జూపరండు, పైపంచెములకు
సంచులందెందు, ఋణమిచ్చు సాహుకారి
వెదకబంపుఁడు, వడ్డికై వెఱవబోకుఁ
డింటిపేరును నిల్పుటయే ఘనమ్ము;

కుక్కుటమ! నీవు సుకృతివి, కోరియూరిని
బెట్టుకొన్నను జావు లభింప దుత్త
రాయణమ్మున, నీవు సంక్రాంతివేళఁ
గత్తిదెబ్బకు శిర మొగ్గి, కదననిహతు
లైన వీరులకే భోగ్యమై, తదన్య
దుర్లభంబగు దివిజేరుదువుగదన్న!

జమిలిపంబను విను గణాచారికేఁబలెఁ
దొలకరిఁ మేఘగర్జనములను విను మ
యూరమున కట్లు దేహ ముప్పొంగు నీకుఁ
దోడి కుక్కుటములు కూయుజాడ వినిన.
ఆమనికిఁ గోకిలాంగన యలరుభాతి,
మైమఱచిపోదు శిశిరాగమమున నీవు
మాటవెంబడి మాట రామానదేమొ?
పొమ్ము నిలువకు బరిమీద ఱొమ్మువిరిచి
నిలిచి కూయుము, నీమీద బలముఁజూప
పుంజొకటివచ్చు దానితోఁ బోరుచుండు
వేళ, వెనుకంజవైచి నిస్పెంచినట్టి
వానికపకీర్తిఁదెచ్చి, యవ్వానిచేతఁ
దిట్టులందిని బ్రతుకకు తివిరి చంపు

సంక్రాంతి.

టొండె చచ్చుటయొండె చేయుదువుగాక.

విధివశమ్మున మా తెల్గువెలమదొరల
శౌర్యములువచ్చిడాగె, త్వచ్చరణాబద్ధ
ఖడ్గప్రతిక్రియం, దీవుగడనచేసి
పంచిపెట్టుము యశము నిచ్చెంచినట్టి
దొరలకున్ గుక్కుటపు ఓడ! మఱచినావ
నెఱుఁగుదువో? లేదో? కంఠముఁ దఱుగునట్టి
కత్తి కాలికిఁగలదంచు, నెత్తురట్లు
పఱద లైపాఱుచున్నను, వ్రాలిపోక
మెడనురిక్కించి రివ్వున మీఁదికెగిరి
కంఠమునఁదుదియూరుపుగలుగుదాకఁ
బోరి మడసెదవో కోడిపుంజా ఓడ !

పట్నమున విద్యఁగఱచెడిబాలకుండ !
పొత్తమున, కయ్యవారికి, బెత్తమునకు,
సలుపుదాస్యమ్మునుండి మోక్షమ్మునంది
చిన్ని చెల్లెలికిఁ బన్నె వన్నెగాజు
బొమ్మలఁగొని మీ గ్రామమునకుఁబొమ్ము,
చిన్నిచెల్లెలి ముచ్చటచెయిదములును,
నాటలాడంగ నిను బిల్చునట్టి తమ్ము
గుఱ్ఱవిసివింపులును, నూరి మఱ్ఱినీడ
జరుగు లోకవార్తాప్రశంసలును, వేచి
యుండె నానందవనధి నిన్నోలలార్పఁ
దేజమొదలిప నీవు సందీప్తి నొసఁగి

బుద్ధికి వికాస ముత్సాహమును ఘటింపఁ
దనివితీరంగ నచట స్వాతంత్ర్యవాయు
వులను బీల్చుచు మీపొలమ్ములను దిరిగి
చీకునుం జింత దిగఁద్రావి చిన్నవాఁడ!
జననియును, జన్మభూమియు స్వర్గసుఖముఁ
గ్రిందుపడఁ జేయునన వినుచుందువుగద
బాలుఁడా ! చూచిరమ్ము మీపల్లెటూరు:—
బ్రాహ్మణుడ! రమ్ము; మకరసంక్రమణపుణ్య
కాలకూష్మాండదానముల్ గైకొనంగ,
సంతచెప్పు మీయేడు సంక్రాంతిపురుషు
డెక్కివచ్చెడి వాహన మేది? పుణ్య
గేహినీ! పెద్దరథమును, వాహనములు
వాకిటను ముగ్గుపెట్టుము; వేకువనె
కన్నెముత్తైదువలు మేలుకనుడు నేడు,
తలలనంటుకొనుండు, కొత్తలుగ వేష
ములను గైసేసికొనుడు; బొమ్మలకలంక
రించి పులగమ్ము వే నివేదించి మీరు
కడుపునిండగ దిని యంత కలకలమని
నిలచియుండుడు మీదు వాకిళులయందు
వచ్చునేడారి బలిచక్రవర్తి నేడు
వరముల నొసంగ మీకు నవ్వారిగాఁగ
రండు మాయింటి కీరు పేరంటమునకు
బొమ్మలెత్తును మాపిల్ల యమ్మలార!

## సంక్రాంతి.

ముద్దచేమంతిపూవులు ముడిచినట్టి
జడలతోఁ గ్రొత్తవల్లెతో నడుగులఁబడి
చిందులంద్రొక్కు పరికిణీ చెలువుతోడఁ
గాళ్లఁ బారాణి; కాటుకఁ గన్నుఁగవను
దిద్దికొని మురిపెమ్మును ముద్దుఁదొలఁక
నగుమొగమ్ములతోడఁ గన్యకలు నీకు
నర్చలొసఁగఁగ నిలచి రీవరుగునపుడు
వచ్చిపోవమ్మ! మాయింటిపజ్జ కీవు
పరమకళ్యాణి! మాతల్లి! పౌష్యలక్ష్మి!—



## జొన్నచేను.

---

“ కంకివెడలిన యాలేతకారుజొన్న
చేనుపైఁ బిట్టలందోలు చిన్నవాఁడ
దారిఁబోయెడు వారలఁ బారఁజూచి
విసరుమా! సుంత వడిసెల; వెనుకనదిగో
కంకితినుచున్నయది గొరువంక—ఇంత
యాలసించిన నిలుచునా? చాలదూర
మెగిరిపోయినదప్పుడే—దిగకుమంచె
బెడ్డలను నీకు నేఁ దెచ్చిపెట్టుచుంటి:

ఒత్తుగాఁబట్టె గడ్డి, మీ గిత్తల కిది
మేపరాయేమి?—మాయావు మేపుమాపు
మొన్న మొన్నటిదనుక దా నన్నియన్ని
పాలనిచ్చెడి దైదుదినాలనుండి
దూడకే చాలకున్న, వీయేడుగడ్డి
బొత్తుగాబట్టలేదు మాపొలముగట్ల—
నాల్గుగుప్పెళ్లు చాలును నాకుఁ—బిట్ట
వాలినట్లుండె మాతోటపైన, సుంత
తోలుమా—నాల్గుగుప్పెళ్ళు చాలునాకు.
ఆసపై నొకతట్టెడు కోసిమాత్ర
మేమిసేయుదుఁ—బిట్ట పోయినద? లేద?"
"సెనగపూరైక దొడిగిన చిన్నదాన!
చిలుక యొక్కటి వ్రాలె నాఘుఱుపునందు
సెంతతోలిన పోవ దేనేమిసేతు?
మెరప తీయేడు మీకు సమృద్ధి: వంగ
చెట్టి లిప్పుడిప్పుడె పూతపట్టుచుండె
బంతిపూవులు మాగ్గులపండువునకు
నక్కఱకువచ్చు; నిర్యోడ నొక్కమిఱప
పండుపండెను—గోయక వదలదీనిఁ
దోలుచుంటిని నేఁ బిట్ట వాలకుండఁ
గోసికొనుమింక గుప్పెడు—దోసతీవ
లున్నవాదరిగాఁ, గాయలున్న వేమొ
చూడుమీ?—నాల్గుకట్టల నూడఁబెఱికి
కంపులను గొట్టుచుందు, నా కంచెకేగి

## జొన్న చేను.

చిరుకులం బెమ్మ వీనిఁ గాచ్చేదవుగాని.
పచ్చజొన్నలు తీయనిపాలుగారు
లేతగింజలు తినుము కాలిచిన నింత
తీపియుండదు—తట్టు నెత్తెద వదేల?
నూగుపోవ నూదెడిదన్క నాగలేవె? ”

“ అప్పుడే యింటిదారి మాయావుపట్టెఁ
గుడితి వేళయ్యెనది యిటుఁ గూరుచున్న
నెట్లు?—లేకంకె ముదిరిన దేల విఱచి
తెచ్చితివి?— చాలు నాకివి తినుచుఁబోదు. ”

“ ఏను వచ్చెదఁ దొందరయేల? నీకు
దోసపండొక్కటియుఁగూడ దొరకలేదె?
యీదరింగల వేకోసి యిత్తురమ్మ.
కల్ల లిట నొత్తుగా నుండెఁగాన నీకు
దొఱక లేదదె! మామంచెదరిని గలవు
కోసియుంచితి రమ్మ నీకొఱకు నేను.
ఆవు నాలుగుబారలే నరుగలేదు
తీసికొని యేగెదవుగాని దోసపండు
కోసియుంచితిరమ్మ నీకొఱకు నేను—
సెనగపూరైక దొడిగిన చిన్నదాన. ”

# ఎడబాఁటు.

---

చ॥ కలువలసంగడీఁడు తెలికన్నులవిచ్చి, వెలందిపండువె ।
న్నెలలను గ్రుమ్మరింప నవనీజములన్ డిగి పిల్లతెమ్మెరల్ ।
కొలనిజలంపు డోలికలోఁ దమిదీరఁగ నూఁగుచుండఁ గం ।
దళితమనస్కుఁడై ప్రకృతితత్త్వము సత్కవి పాఁడుచుండగన్ ॥

చ॥ పొగిలెదవొంటిపాఁటునఁ "గువ్వాకువు" మంచుఁ బ్రతిక్షణమ్ముఁ బై ।
కెగసెదు, సల్కలంకలకు నేగెదు సైకతభూమిఁ దారి నె ।
వ్వగ మెడద్రేలవైచెదు, భవచ్చరితమ్ము విచిత్రమయ్యె, నీ ।
మగువనువీడి కాదుగద మాకెఱిఁగింపుము చక్రవాకమా? ॥

ఉ॥ అంటిన మాయు ఱెక్కల నొయారముగా విదళించుకొంచుఁ గ్రీ ।
గంట నొకళ్ళొకళ్లఁ దమకమ్మునఁ గన్గొని ముద్దులాఁడుచున్ ।
జంటఁ దొఱంగి యొక్కనిముసమ్మెడగాఁ జరియింప రట్టి నీ ।
పెంటినిబాసి యొంటి విలపించెద వెందులఁబోయెఁ దెల్పుమా ! ॥

చ॥ తెలినులిఱెక్కచెల్వమును దీరును దీయము గల్గు మేనిని ।
గ్గలును మొగంబు నొప్పిదముఁ గుందనపుందళుకారు రేకలున్ ।
గులుకునడల్ మెడన్ మలచుకొంచుఁ జరించెడి నీఁటు రాఁకపో ।
కలఁగని మెచ్చుకొందుమిటఁ, గన్పడదెందులఁబోయెఁదెల్పుమా !॥

ఉ॥ తెంపరియౌచు మిమ్ము విడదీయఁగ దుర్జను డెవ్వఁడేఁ బ్రయ ।
త్నింపఁడుగా; సమీపముననే పొలయల్కను డాగి నిన్ బరీ ।
క్షింపదుగా; పసిండినగిషీపనియీకలపట్టుకుచ్చు నా ।
క్షింపదుగా తలన్ ముడువఁ ఝెంచునెలంత పిసాళిజంతయై ॥

ఉ॥ చూపఁగలేక నీదు సొగసుం జెలికాఁడము చక్రివైరి రే |
గాడుపుటూదరల్ గొలుపఁగా వడగొట్టి యొడేని వృక్షపున్ |
నీడను సొక్కి, చల్లనగు నీ కయిదండను గోరి, "యక్కటా !
రాఁడుగదా ప్రియుం"డనుచుఁ బ్రాణములన్ బిగబట్టియుండెనో? ॥

చ॥ కుతిలపడంగ నేల యనుగుం జెలికై యిటు లెల్గురాల్పడన్ |
వితగ; నినున్ దలంచి దురపిల్లుచు నెచ్చటఁగూలియున్నదో |
వెతకఁగఁబొమ్ము; కల్వచెలివేడుక కాఁ డొడిగట్టె నీ దురా |
గతమున, కింకశంకకొనఁగా బనిలేదు విహంగపుంగవా! ॥

ఉ॥ తామర తూఁడులన్ మెసవి, దప్పికకై తెలినీరుఁ గ్రోలుచున్ |
ప్రేమరసంపువెల్లువ మునింగి సుఖించెడి పుల్గుజంట, న |
య్యో ! మితిలేని దుర్భరవియోగదవానలమందు వ్రేల్తురా |
రాములు నీవనున్ గలరురా ! విని నవ్వరురా ! నిశాచరా! ॥

ఉ॥ సాటిపులుంగుటంగనలు జంటలఁగ్రుచ్చి కవుంగలించి స |
య్యాటల నాడుచుండ, నకటా! మనజక్కవ పెంటి యొంటిగా |
గాటపుటీ యెడాటమునఁ గ్రాఁగుచు వేగకయున్న యీనిశిన్ |
మాటికి మాటికిన్ ప్రియుని మక్కువ లెంచుచు నేడనున్నదో ॥

ఉ॥ కోకమ! తెల్లవాఱ దనుకోకుమ, క్రుంకిన భాస్కరుండికన్ |
రాక నిలండు చెందొవలరాయఁడు పోకనిలం, డెడాటపున్ |
గాకలఁ గ్రాఁగినట్టి చెలికౌఁగిటఁ జొక్కక పోవు; మానుమీ |
శోకము; పోయివచ్చెదము, చూతుముగాక మిమున్ సుఖంపడన్ ॥

# అజ్ఞానకృతము.

---

ఉ॥ సొంపులుగుల్కు నొండొరులచూడ్కులు ప్రేమదొలంక, గాలికిన్
గంపముజెందు బాహులతికల్ పెనవైచి, జనమ్ముచూడ్కి మో ।
హింపగజేయు పూవుఁగన, యేకతమట్టుల నేకశయ్య ని ।
ద్రింపగ నొక్కదానివిడదీయఁగ జేయెటులాడె? పుత్రికా॥

చం॥ కనులుమొగిడ్చికూర్కు తనగాదిలిబిడ్డను, నీవు త్రుంచిపో ।
యిన, గని తల్లితీవ నిలువెల్ల జలింపఁగ నెట్లు విహ్వలిం ।
చునొ, కనుగొంటివే? కడుపుమమ్మలుచుట్టగ బాష్పబిందువుల్.
కనుఁగొనలందు నిండి తొలఁకన్ గనువారల గుండె నీరగన్॥

చం॥ కటకట! నిద్రలేచి తనగాదిలి చెల్లెలుగాన రామి, మి ।
క్కుటమగు నార్తిజెంది, నవకమ్ములు మాయగఁ దొంటిమేనిము।
చ్చటలకుబాసి, యెంతటివిషాదము జెందునొ? జంటపూవు; నీ।
కటికతనమ్ముగన్నఁ గొడుకా! భయమయ్యెడు నేమిసేతురా!॥

ఉ॥ వేకువఁ జల్లగాలి కనువిందుఘటించెడి పూవుజంట, డో ।
లాకలనమ్మునన్ మిగుల లాలన సల్పుచు నిద్రపుచ్చి, యి ।
ద్దై కడకేగె; సంజ నది యీడకు గ్రమ్మఱవచ్చినప్పుడి ।
య్యాకులపాటుసూచి తనయా! యెటులౌనొ? విషాదవేదనన్॥

ఉ॥ నిన్నటిసంజఁజెల్లి "జననీ! యవికోసియొసంగు" మన్ననీ ।
క్రొన్ననతెల్లివిచ్చినను గోసి యొసంగదనంటి, శయ్యపై ।
కన్నులువిచ్చి జాలకముక్రిందల నీదురవస్థచూచి, యా, ।
చిన్నది, యెంతపోరిడునొ? చెంపలనశ్రులు జాలువాఱగన్॥

ఉ॥ వెంగలి! నీకిదేమి యవివేకమురా? పరువంపుమొగ్గదో ।
యింగని, నిన్న "వీనినిక నెవ్వరు ముట్టకు" డంచుఁ గట్టుగ ।
ట్టెం, గిరిగీసి, మంత్రము పఠించుచుఁ, దేనియ లానవచ్చునా ।
భృంగకుమారుఁడెంత మరపిల్లునొ? విచ్చినపూవుగానమిన్॥

కం॥ చల్లని ప్రేమరసముఁ బై
జల్లుచు రేయెల్లసాకె చంద్రుఁడు వీనిన్
బిల్లడ! మాపటికిన్ జిం
తిల్లుచుఁ దనపూవు గనమి దెసలఁ బఱచుగా॥

ఉ॥ కాదనలేనుగాని, యపకాలపుమృత్యువువాతఁబడ్డ నీ ।
గాదిలిబిడ్డకై వగవగానిను; నాసుతు నీదుబిడ్డనిం ।
గాఁ దలపోసి యూఱడుము కన్నుల నీరిడకమ్మ! తీవ ము ।
త్తైదువ! పెద్దదానవుగదా? కలకాలము నీవు మేలగున్॥



# రసాలము.

ఉ॥ కాలవశమ్మునన్ విసరుగాడ్పులకున్ ముదురాకుపుట్టముల్ ।
రాలఁగ బాటసారులఁ బరామరిశింపగలేక సంపదల్ ।
దూలినదాతవోలె, జిగిదూలిన యీ యెలమావిగున్న, యా ।
కాలవశమ్ముచేతనె, సఖా! వికసించెడిసారుగంటివే ॥

ఉ॥ చూచుకొలంది వింతలగుచున్ మనమున్ గరఁగించి నన్నుఁ జే
రేచఁదొడంగె, నీదు నునురెమ్మలకైవడి మోసులెత్తు వా ।
చాచతురత్వమంతయు రసాలమ! నీపయిఁజూపు ముంచదే ।
నీచివురాకుతళ్కులును, నీపువుగుత్తులకుల్కునవ్వులున్ ॥

చ॥ పరిణతసత్ఫలమ్ముల, సువాసనలీను సుమమ్ములన్, మనో ।
హరమగు తేనెచొన్నల లతాంతరజమ్మను కుంకుమమ్ముఁ బ ।
ళ్లెరమున నించి, చేతఁగొని లేనగ వొప్పఁగ దోఁటవాకిటన్ ।
సురుచిరమూర్తితో నిలుచు, శోభనదేవత వీవు భూజమా ॥

చ॥ కలిమిఁబోలంగి యత్నములు గాలికిఁబోయి విచారమేఘముల్ ।
దలముగఁ జుట్టుకొన్నఁ బరితాపము చెందుటెకాని, యెన్నడున్ ।
దెలియకపోతి, జీవమునఁ దేజమొకండు నశింపకున్న నీ ।
వలె మధుమాససంజనితభాగ్యము లందెదనన్న ధర్మమున్ ॥

శా॥ పాయన్ జాలనునిన్ను, నన్ విడకుమీ ప్రార్థింతు, నీపండ్లుగా
నీ, యాపూవులుగాని క్రొన్ననలుగానీ, చేత ముట్టన్ జుమీ ।
నీయానన్ ఇచియింతు నమ్ముము, నినున్ వీక్షించుచున్ జొక్కి నీ ।
ఛాయాశీతలసైకతస్థలి సుఖస్వాంతేన్ గనుల్ మోడ్చెదన్ ॥

సీ॥ తలిరాకుజొంపమ్ము తళుకునిగ్గులు
నాదు నేత్రయుగ్మమ్మున నిండనిమ్ము।
పూఁదేనియల చొక్కపుందీపురుచులు
వాగ్విలసనంబునకు లభింపనిమ్ము।
కలకుబంగరుచాయగల పండ్లమిసిమి
శరీరమ్మునకు నావరింపనిమ్ము।
పూవుగుత్తుల కమ్మతావులు నా
యూర్పుగాలితో నైక్యమ్ము గాంచనిమ్ము।
గీ॥ ప్రకృతి సౌభాగ్యమంతయు, రాశియైన
విధమునన్ దోచుచుంటివి, వెతకి, వెతకి।
యీసరికి లభ్యమయ్యె నుపాసనాధి।
దేవతయటంచు, నిన్నునర్థించుచుంటి॥

గీ॥ జంతుకోటికి సంతాపజనకమైన।
చండభానుని కరసహస్రమ్మునుండి।
యమృతము గ్రహించుశక్తి నీయందెకలదు।
దానిదయసేయుమమ్మ! యీతనికి సుంత॥

---

"రసాలము"నందు మొదటిపద్యము రెండవపాదములో "పరామరిశింపగ"కు బదులు "పరామరిసింపగ" అని చదువుకొనవలెను.

# తొలి పూత.

---

## గీతము.

కార్శ్యతను జెంది, బడలికం గనులుమోడ్చి,
మేనుమఱచిన జగముల మేలుకొలుపం
గోకిలాకాహళము నూదికొనుచు, శీత
లానిలోపచారమ్ముల నమృతకలశ
హస్తుడై నూత్నచైతన్య మనువుపరుప
సాగె, నదె పుష్పసమయైందజాలికుండు.
కనులు నులుముచుం బ్రకృతి యంగకములల్ల
నల్ల సవరించుకొనుచుం బాయంగం దోచి
ముసుగు, విడిజారుకొప్పును ముడిచికొనుచుం
బడలికలువాయ లేచినిల్వందొడంగె
నిదురచొక్కులు గన్పడనీక మేను
గరగరికసల్పి చివురంచుకట్టుపుట్టు
మును మడతవిప్పి కైసేసికొనందొడంగె.
కలకల నవ్వుచప్పుడే తలుపుదెఱచి
వాకిటన్నిల్చి తొయ్యలుపడి సెబాసు !
స్వాగతము నీకు వాసంతి ! స్వాగతమ్ము.
పాన్పుపైనుండిలేచిన ప్రకృతియెడదం
దోలకరించు పూర్వస్మృతికళికయనంగం
దోచితివి ; క్షీరసాగరవీచికాక
పోలమున శీతకరు తొలిముద్దువలన

# తొలిపూత.

వెల్లివిరిసిన యొలసిగ్గు గొల్లగొట్టి
తెచ్చుకొంటివో ? యీమేని తియ్యఁదనము ;
పొడుపుగొండగద్దియమీఁద ముగుదతనపు
జెక్కులకొ గెంపుజాఁదులు చిందులాడ
నిలిచెనదిగో ! యుషః కన్య ; నిన్నుగాంచి
యక్కజముదోప "నీవెప్పు డరుగుదెంచి
తే" ? యనుచుఁ గుశలప్రశ్న సేయుచుండె.

లేతప్రొద్దుల నవకమ్ముచేత నీవు
చెలువుగాంతువో ? యుదయలక్ష్మికిఁ ద్వదీయ
సౌకుమార్యమె కొంగ్రొత్తసంతరింప
గలదో ! యేనాటి దీచెల్మికలిమిమీకు !

అమరసైతినిందనక నే యమృతకుక్షి
నడగియుంటివి ? నవకమ్ము సెడదు; తీరుఁ
దీయములు నింతయొప్పునే దివ్యగాన
సమవిరతసుస్వరతరంగశాంతగతుల
బొడమితివినీవు ? విశ్వమ్ముఁబులకరింపఁ
జేయుచల్లని యీతావి శీతకరుని
హృదయమున దాచికొంటివా యిన్నినాళ్ళు ?
ఎవరుచాటిరో యీవార్త ? నింతలోన
ప్రకృతిసర్వమ్ము నినుగాంచి పటమునందుఁ
బోలె నిశ్చలయై ముక్కువేలితోడ
నక్కజమ్మునని ల్చె ; "నౌరా ! వసంత
బాలికండప్పుడే నాందిచదివి యాట

మొదలిడెనె ? ” యంచు భాస్కరుండుదయశిఖరి
దటిని నినుజూచి యరుణిమఁ దాల్చెనుంత.

మెత్త మెత్తని రేకుల నొత్తిగించి
వెలినిగుడు నీదు హృదయపవిత్రరాగ
రసము వేవేగ రవికి నర్ఘ్యమొసంగు
మిడుగో ! నిను వాశిమీర నుయ్యేలలూప
నాయితంపడె మృదుమలయానిలుండు.
జోలపాడగ రారమ్మ ! శుకపురంధ్రి
లార ! గోరువంకలైదువలార మీరు !
వాకు విప్పవె నీవింక కోకిలమ్మ !
పాటకత్తెవు నీవెకా ? పలుకవేమె ?
సూర్యకిరణపథమ్మున జూపవలన
చెఱుఁగమే ! మేము నీమేని గరగరికలు
వెడలి రమ్మింక సిగ్గుల పెండ్లికొడుక !
పాటకుడ వౌదువెమ్మ బంభరుడ; రేపు
మొదలు తనివిసనంగఁ బాడెదవుగాని
వేగ దయసేయుము మీ పెండ్లిపీటపైకి.
జగములకునెల్ల నానందసంవిధాయి
యగు వసంతుని తొలిచూలు ముగుదతనపు
ప్రథమయౌవనసుధ గ్రోల రాగదయ్య.
నీలమేఘుడ వీవు, మాబాలతలకు
చిలుకు తొలకరిమెఱుపు, మీచెలిమికాడు
మలయపవనుండు నొకచోట గలసియాడి

## తొలిపూత.

కాలగతి రహస్యము చెల్ప గడఁగుడింక.
పరిణయాగతద్విజకులవనితలార !
పలుకుజవరాలివీణతోఁ గలిపి యొక్క
మంగళము పాడరమ్మ బంధురవరునకు
సకలసౌభాగ్యవతికి వాసంతికకును.

---

## ఎవరు నీవు ?

---

నాటి నిశీథిఁ గంటకమునాటినపూవుచెడందతోడ న
న్యేటికురంగటన్ బొదలయీరమిఁ గారుమొగుళ్ళఁ జీకటుల్
గాటముగాగ నొంటివయి కన్నులనీరిడువేళ మింటిపై
గాటి తళుక్కునన్ మెరసి తారితివెవ్వరు నీవుచెప్పుమా ?
॥ చికిలికన్నులు సామోడ్చి శీతకరుఁడు
కునుకుచున్ బోవువేళ దవ్వున గళమ్ము
లెత్తినక్కలుకూయిడ నించుకించు
కాలెడి చితాగ్ని దరికోల్ప నాననమ్ము
వంచి నేనూదుతఱి వాయువశతగదలి
యాడు నెరమంటలన్ లేచి యల్ల మేలి
ముసుగుమాటునవవ్వి కన్మొఱగిపోతి
నేను మొగమెత్తులోన నీ వెవరుచెపుము ?

ఈవె కాదె ? మఱొక్క రేయింటి వెనుకఁ
జెరటిలో, మోడ్వడిన చెట్టుతోరటలో, ది
వాంధ మొక్కండు తీరిక నాలపించు
మృదుల గానమ్మునకు వీణె మేళవింప
నేను తంత్రులు సవరింప నెచటువచ్చి
యో ? మొగమ్మున మొగమిడి యులికిపడిన
నన్ను గికురించిపోతి నీ తెన్నువట్టి
"ఏవరు నీవ ?" ని నే వెంటఁ దవులుకొలది.

తుది మొదలు లేని గంభీరదుఃఖఘోష
మునర, బ్రహ్మాండముల్ దిగుల్వడఁగ, నెత్తి
మోదికొను వారినిధితీరమునను దాని
బాష్పజల మేను దోయిట బట్టుచుండ,
పొంగివచ్చు తద్దుఃఖతరంగములను
తేలియాడుచు నరుదెంచి, దివ్యధామ
కాంతి దొలకు నపాంగవీక్షణము నాదు
స్మృతిముకురమందు నస్పష్టబింబమీనఁ
జిరునగవు తొల్కరింప నఱజేరి చెవిని
"ఏమి వ్యాపార మిది" యంచు నెగిరిపోతి;
వేల నన్నిట్లు వెంటాడ ? నెవరు నీవు ?
కనులు మూయుట తడవుగా, కలువరేకు
వ్రేళులను ఱెప్పతుదల మంత్రించి, నన్ను
నిదురపుచ్చి, చెంతను జేరి, మృదులమధుర
మందనిశ్వాసవశత నా పై చెమర్చ

చెవిని నేనాటిమాటలో చెప్పి, నన్ను
నెత్తుకొని, చంద్రికాపూర మీదుచుందు
వంతలో నీవు వెన్నెలవౌచు, నన్ను
వెన్నెలపులుంగు గావించి విందుసేతు ;
భ్రమరమై నీవు నన్ను కీటమునొనర్చి,
పూవుపూవునఁ దేనియల్ ద్రావఁజేతు,
పూవువై నీవు ననుదాని తావిఁజేతు
వీవుపూదేనె వాకవై, యితనిపూవు
సలిపి తేలింతు "విదియేమి సగసము" న్న
" ననుదిగమ్మిట్లు క్రీడింతమా ? " యటందు
వెవరునీవు ? ఎందో మున్న నే నెపుడో నిన్నుఁ
జూచినట్టుల లీలగాఁదోచు, నాకుఁ
జూపవెన్నడు నీ కలరూపు నిజము.
కనులకందదు నీవ్యక్తి, కరముజాటి
పోవు నీచేయి, స్వాప్నికభువనవాసి
వీవు నిక్కమ్ము. కాకున్న నెవరునీవు?
" అలికికొనిపోయె స్మృతిపథమందు నీదు
నడుగుజాడలు, దడదడలాడు నెడఁద
నడిగిచూతును, తాళుమీవ " న్న, నన్ను
గారడీయొనర్చి, యీాయభీరమునను
నిటుల నెలయించుకొని వచ్చి యెగిరిపోయి
యవలి మొగ్గనునిల్చి నన్నిటకుఁబిలుతు,
వీవట నెయ్యుండు మిద్దటి నేనునిలుతు

నిరువురముఁ జేతులనుగల్పి యీమహాబ్ధి
పైన సేతువు నిర్మింపవచ్చుమనము.
అవలియొడ్డునసీవు నే నివలిదడిని,
నిలిచి తీరద్వయరహస్యములను జలధి
గర్భమున మార్చ్వలుకునట్లు గానములను
సలిపి, యిద్దఱి, నద్దఱిఁ, గలుపవచ్చు.

ఇంతయేమిటి కగుచు నే నివలియొడ్డు
నవలియొడ్డువుకమ్ము నీ వంత మనము
జలధితరగల గుసగుసల్ సలుపవచ్చు.

అబ్ధియీవలిచెలిగు నే, నవలిచెలిగు
నీవుగై కొని, పైకెత్తి నీవునేను
నంబునిధిలోన దోబూచు లాడవచ్చు.
పలుకువినిపింపు కొనకట్లు పిలుతువేమి ?

ఈ విటకురానిచో, నేనె యొగిరివత్తు
నిరువురము నాపలీవలి కెగురుచుంద
మెల్లకాలమ్ము గవగూడి, యెందునిలక,
యిచటిమాటల నచ్చట, నచటిమాట
లిచటదలపక, యేమియు నెఱుఁగనట్లు
కడలి, మనకాలిజాడలు తుడిచివైచు.

"ఎవరునీవ"ని యడుగనిన్నింక, నీవు
నడుగవలవ, దీయాట నీకభిమతంబె ?
కలియుగానత్తు నిన్నందునిలువుము, సుంత॥

## బోను లోని సింగము.

---

గీ॥ విశ్వజనకునిసృష్టికి వికృతిగూర్చి
ధ్వస్తమొనరించు మనుజహస్తప్రహార
చిహ్నములులేక యభివృద్ధిచెందుచుంట
యే, తమసంబనిగాగఁ బెల్లెదిగినట్టి
చెట్టుచేమలు, లతలును, బుట్టలును, న
నేకమృగపక్షిపన్నగానీకములకు
నాశ్రయణమిచ్చి, స్వేచ్ఛావిహారములకు
ననువొసంగునట్టి ఘోరకాంతారమునకు
సార్వభౌముఁడవై, నిజసాహసమ్ము
శాసనమ్ముగ భవదస్యసత్త్వములను
బాలనమ్మొనరించుచు, వలయు మత్త
హస్తిమస్తకమస్తిష్కమారగించి
నిర్భయమ్ముగ గుహాలలో నిదురసెంది
కాలు మోపియు మోపక లీలనొక్క
చటియపైనుండి యొండొక్కచటియపైకి
దుముకుచుంబోయి, పర్వతాగ్రముననొక్క
సమశిలాసింహపీఠిపై చక్కఁగొలువు
దీర్చి కాల్దివ్వి, తోకవిదిర్చి, శైల
గహ్వరమువంటి వెడదవక్త్రమ్ము విప్పి
జలదములు మారుమ్రోయ "నాసార్వభౌమ
పదము నుల్లంఘునమ్ముసల్పంగ నెవఁడు

చాలురా? ” యంచు ఘోరగర్జనమునల్పు
నట్టి మృగరాజ! యెట్టియిక్కట్టువచ్చె ?
మనుజమాత్రుండు నీసైజమును హరించి
కన్నుసన్నల నిను నానగట్టి యాట
బొమ్మగాఁ జల్ప వశమయిపోతి వకట !
ఆఱిపోయెను నీలోనియగ్నికణము
కట్టువడిపోయె నీమేఘగర్జనములు
చల్లవడె నన్యదుస్సహసాహసమ్ము
బండవాఱెను నీగోళ్ల వాడిరేక
చినిగిపోయెను నీతోకచివరకుచ్చు
విరుదుచచ్చెను నీకింక మఱలిరాదు.
అకట ! తొల్లి నీ స్వేచ్ఛావిహారములకు
నడవి యిరకటమైతోచు, నట్టినీకుఁ
బంజరపుబంధన మ్మెట్లు ప్రాప్తమయ్యె ?
బక్కయెద్దునుగొట్టెడి పంటకాపు
పోల్కి, నిను వీఁడు మునికోలమోదుచుండ
నోదిగి, జవదాటజాలవయ్యో ? మృగేంద్ర !
సైచియును సైప కవలికిఁ ద్రోచివైతు
సమదగజరాజకుంభమాంసమ్ము మున్ను
వీఁడుపెట్టెడి బిచ్చపుంగూడు నేఁడు
సైచునే ? నీకు; నక్కటా ! సత్యమునకుఁ
గట్టువడి యిటు లుంటివేకాని నిన్ను
గట్టివేయగ నెవనికిగలదు శక్తి ?

నీదు సౌభాగ్యపుగతికి నిన్నుఁజూచి
నేనె కన్నీరు విడిచితి, నీకుఁజింత
లేదొ ? లోలోఁ గడుఁగుమారిలెదవొ ? యేమొ;
తగినసమయమ్మునకు వేచి తాళుచుంటి
వో ? యిసీ ; యిప్పు డొకపెద్దబొబ్బవెట్టి
చఱచుమా పంజరము నొక్కచఱపు, విఱిగి
కూలదే ? నీదుధాకకుఁ గొండగుహలె
కదలిపోవఁగ నీబోను గట్టిచెడదె ?

విధివశమ్మున నెంతటి వీర్యశాలి
కేని, దురవస్థ ఘటియిల్లుటే నిజమ్ము
గాని, యలసునివలె నిట్లు కష్టసమయ
ములను నినుబోటి కన్నులు మూయ దగదు.
లెమ్ము; మృగరాజ ! యత్నింపలెమ్ము నీవు.

మనుజమర్కటమా ? నీకు మంచికాదు
సింగపుస్వేచ్ఛఁ బరిహరియింపఁ, బొంగిపడకు
" సృష్టినాయానతికిలొంగు, సృష్టి కేను
సార్వభౌముడననుచుఁ గష్టమ్ములోర్చి
యోర్చి, మనసువిఱిగి, యన్నయునికి దెలిసి
యుంచుకంత పుచ్ఛముదుటాయించి, కనులు
విచ్చి సింగమ్ము నినుఁజూడ బెదరిపోదు
గాని నీ తంత్ర మప్పు డక్కఱకురాదు.
విడిచిపుచ్చుము సింగమ్ము; విడిచిపుచ్చు;
మనుజుడా ! దానియోర్పు నమ్మకుము నీవు;

# రక్త తిలకము.

చం॥ హాతవిధీ! యెన్నికష్టముల కగ్గముసేసితి; తాత తండ్రు లం।
చితగతి నేలు రాజ్యరమణిన్ దురకల్ గ్రహియించి యేల, దీ
నతమెయి నీ యరాషళి దినమ్ములుపుచ్చెడు నన్ను; నేటికీ।
గతిని గిరాతబాణహతిఁ గాటియ పాలొనరించినాడవే॥

గీ॥ 'బాప్పరావలు' పావనవంశసంప్ర
భూతుఁడగు వానికొక్క కిరాతముఖ్యు
వలన నెంతటి కష్టంపుఁబాటుగలిగె
దైవమా! నీకు నామీద దయగలుగదె?॥

గీ॥ కష్టసుఖములు కావడికడవ లనుచుఁ।
బలుకు పెద్దలవాక్యమ్ము పాటిచేసి।
మూపు కాయలుగాయంగ మోయుచుంటిఁ।
గష్టపుంగుండ; దీనికి గడవులేదె?॥

ఉ॥ 'ఘాదుషహా' నెదిర్చి తమ ప్రాణము లర్పణసేయఁ దండ్రియున్।
గాదిలి యన్నదమ్ములు నఖండవరూధినితోడ; నన్ను నా।
రా! దెసమాల్చి యిట్టుల నరణ్యముపాలొనరించి, మ్లేచ్ఛర।
క్తాదనయోగ్యమౌ నిశితఖడ్గము గట్టెలగొట్టఁ జేసితే?॥

మ॥ జనకా! లక్ష్మణసింగుజీ! సుతులతో సన్నద్ధమై యాజికిన్।
జను నీవెంబడి నే చితోడునగరిసామ్రాజ్యలక్ష్మిబుణ।
మ్మును బోకార్పగ నాజిఁ దెళ్లుచు దివమ్మున్ జేరగానీక మ।
న్మనిఁ బోషింపఁగ నానవెట్టి ననుగాంతారమ్ము పాల్సేసితే॥

గీ॥ తరతరమ్ములనుండి నాతాత తండ్రు ।
లేలికొన్న చితోడ్ పీఠమెక్కి తురక ।
పాలనము సేయ జీవచ్ఛవమ్మనగుచుఁ ।
గనులఁజూడంగ వలసె మజ్జనకునాజ్ఞ ॥

ఆ॥ సమయమునకు వేచి సాధించి మఱలఁ జి ।
త్తూరుగడెము; నీ హమీరు సింహ ।
పీఠి నిల్పుమంచుఁ బెట్టె నానతిఁ దండ్రి ।
యీకుమారు నిప్పుడేమిసేతు ॥

గీ॥ ఎన్నికడగండ్ల కే నోర్చియున్న సిరులు ।
మఱల మముజేరుకాలమ్ము మఱలివచ్చు ।
చిన్నెలగపడ విప్పుడీ చిన్నవార ।
లధిగమించిరి నానాట యౌవనమ్ము ॥

చం॥ ఇతరసుఖమ్ములెట్లయిన నెట్టులో కాలముఁబుచ్చుచుంటి నీ ।
సుతులను గన్నులారఁగనుచున్ సహియింపకపోయె దైవ మీ ।
కుతుకలవమ్మునైనఁ గడగొట్టు కుమారుహరించె ; నింక జ్యే ।
ష్ఠతనయుడే హమీరుడయి సజ్జనుడే కడగొట్టువాఁడగున్ ॥

కం॥ సమశీలవయస్కులు, స ।
త్తమవిద్యానిధులు, శూరతాఖనులగు నీ ।
కొమరుల హృదయమ్ముల వి ।
క్రమరసమూరుటలు గనినఁ గడుపుచెఱువగున్ ॥

చం॥ నిడుదకనుల్, విశాలమయి నిగ్గులుదేరెడి ఫాలభాగమున్, ।
వెడదయురమ్ము, రాజ్యరమణికి వహించెడునున్నతాంసముల్, ।

కడు బెడగై హామీరుసకుఁ గన్పడు పీఁడెఁనిజమ్ముగా జితోక్ష!
గడెముజయించి యేలుకొనగాఁ దగువాఁడనితోపఁజేయుచున్॥

గీ॥ తల్లి! చిత్తూరుపురలక్ష్మి! తండ్రియాజ్ఞ!
కనుగుణమ్ముగ భ్రాతృపుత్రుని ద్వదీయ!
సింహపీఠమ్ముపైనిల్పి చింత లేద!
నున్న నాకోర్కి పండదే యొన్నటికిని॥

ఉ॥ అక్కటా! యేటి కింతయడితూస వహించెద పీ మహాటవిన్!
దిక్కటి మాంజబాణనిహతిన్ బడి మారొనరింపలేని పీ!
డెక్కడ! యాచితోడుపుర మెక్కడ! యింతయొఱుంగ వృటిపై!
కెక్కఁగలేవ, స్వర్గమునకెక్కగ నేర్తువె? మూషచిత్తమా॥ ”

॥ అనుచుఁ దనదురవస్థను నాత్మచింత!
నందు గేల్వడదుర్గమ్మునందు నొక్క!
నా డజయసింహుడొంటిమై, వాడబాతి!
ముడుతనడుచెక్కిలిని గరమ్మున ధరించి॥

॥ వేడినెత్తురులొలుకఁ గ్రొవ్వాడియలుగు!
పోటుగంటులనుండి, యాముదుకరాచ!
బిడ్డ; రాజ్యచ్యుతికిఁ దోడుఁపడ్డనాటి!
మానహానికి వెతఁజెందు మానసమున॥

। కండవేర్లెడుకరమునఁ గనులనీరు!
వోఁదుడుచుకొంచుఁ ఁబగదీర్పఁ బూసఁగదేని!
మఱలిరా'నంచు మాంజువెంబడిన చనిన!
యన్నకొమరునికై దెసలరసి, యేల?
తడసెనో? యంచు కళవళపడుచునుండ॥

ఉ॥ పెంజడివారగా రుధిరబిందువులొల్కుచు, భీతిగొల్ప నా ।
హాంజుని శీర్ష మంఘ్రితలమండనముం బొనరించి, యంతటన్ ।
బ్రాంజలియై హమీరు తనయగ్రమునన్ నిలువంగ, మ్రాన్పడెన్ ।
గ్రొంజెమటల్ జనించుచు గగుర్పొడువన్ దనమేను వృద్ధుడున్ ॥

గీ॥ హర్షసంభ్రమపులకితమైన చేయి ।
సాచి, 'దరిఁజేరరమ్ము; వత్స' ! యటంచుఁ ।
దిగిచి కౌగిటఁ జేర్చి, రుధిరమయమ్ము ।
లైన యంగకముల నల్లనల్లఁ దుడిచి ॥

చం॥ "తెగువమెయిన్ గుమార! పగదీర్చితి వింతటి సాహసమ్ముసే ।
యగలవటంచు నెంచను, మహాబలు హాంజుని ద్రుంచి, లోపలన్ ।
రగులుచు బాధవెట్టెడి పరాభవ దుఃఖము నార్చి, నాకుఁ బ్రీ ।
తిగొలిపి; తేమి ప్రత్యుపకృతిన్ బొనరింతును నీకుఁ జెప్పుమా"? ॥

గీ॥ "రాజ్యహీనత నిట్టు లరాఽవళీమ ।
హీనగిరిగహ్వరములఁ గృశియించు నేను ।
నీకు నేముద్దు సెల్లింపనేర్తు" ? నని; కి ।
రాతు పుత్త్రియ వ్రేలుగ్రుచ్చి రక్తమెత్తి ॥

మ॥ నుదుటన్ నెత్తురుబొట్టువెట్టి, "యరి నున్మూలించుయత్నమ్మునన్ ।
గదనక్షోణికి నేగు నాజనకుడాశ్లాషించె నాకెట్టులేన్ ।
బదిలమ్మౌగతిఁ బెద్దవాదనుక సంరక్షించి సామ్రాజ్యమ్మహో ।
పదవిన్ నిన్నభిషిక్తుఁ జేయుమని యాభంగిన్ నినున్ బ్రోచితిన్ ॥

గీ॥ నాకు లక్ష్మణసింగురాణా వచించి ।
నట్లు నిన్నుఁ జిత్తూరుసింహాసనమున ।

కిదియె యభిషిక్తుఁ జేసితి: నింక నాదు ।
సుతుఁడు పరదేశములకేగి బ్రదుకుగాక॥ ”

మ॥ అనుచున్, సజ్జనసింహునిన్ బిలిచి, ‘వత్సా ! నీవుచిత్తార్గడన్ ।
మ్మనకాసింపకయెందునేన్ బ్రతుకుమాపొమ్మం’చుబల్కంగ, వా
డనుమానింపక, మ్రొక్కుచున్, జనకు గాఢాలింగితుంజేసి స ।
ప్రణయుండౌచు హమీరువీడ్కొనిమహారాష్ట్రమ్ము సేరన్ జనెన్ ।

కం॥ జనకుని పంపున జగతిసర్వము దమ్మునకిచ్చి, కానకున్ ।
జనురఘురామమూర్తియన సజ్జనసింహుఁడుపోవ, మ్లేచ్ఛులన్ ।
మునుమిడికాల్సగాఁ దనదుమూఁడవకంటినివిప్పు శంభుశంక ।
కనుగలిగించె రక్తతిలకమ్మునుదాల్చి హమీరసింహుఁడున్ ।

గీ॥ తండ్రియాజ్ఞతి నొదలదాల్చి పుత్రు ।
నిలువెడలగొట్టిన యజేయుఁడే ఘనుండొ ?
జనకునాజ్ఞనెట్టుల శిరసావహించి ।
చనిన సజ్జనసింహుఁడే సజ్జనుండొ ॥?


సంపూర్ణము.